# భారతీయ భాషల కథలు

## సంస్కృతము



విద్యార్థి ప్రచురణలు
విజయవాడ _ 2.
హెడ్డాఫీసు : ప్రగడవరం (పోస్టు)
(వయా) చింతలపూడి, ప. గో. జిల్లా.

శ్రీ

# చతుర్దశ భాషా నిబంధావళి

## భారతీయ భాషల కథలు

అను

## భారతీయ భాషా సాహిత్య చరిత్ర

*

అనువాదం :

సాహిత్య విద్యా ప్రవీణ, సాహిత్యాలంకార,
ఆంధ్రభాషా ప్రవీణ; రాష్ట్రభాషా ప్రవీణ.


పన్నాల వెంకటాద్రి భట్టశర్మ, B. A. P. O. L.

పిఠాపురము - కిర్లంపూడి.



మూల ప్రచురణ : బీహార్ రాష్ట్రభాషా పరిషత్తు.

# మనవి.

"చతుర్దశ భాషానిబంధావళి" అనే ఈపుస్తకములో భారత రాజ్యాంగం స్వీకరించిన 14 భాషల ఉత్పత్తీ; సాహిత్యరచనలూ; రచయితలూ; వారిచరిత్రా మున్నగు విషయాలపై ఆయాభాషలలో విశేషజ్ఞులైన విద్వాంసుల సమీక్షలు ఉన్నవి. ఈవ్యాసాలను ఆవ్యాసకర్తలు అప్పుడప్పుడూ బీహారు రాష్ట్రభాషాపరిషత్తు వార్షికోత్సవాలలో చదివిఉన్నారు. 1957 లో ఈవ్యాసాలకు పైపరిషత్తువారు పుస్తకాకారం ఇచ్చిఉన్నారు.

ఈవ్యాసాలు ఆయాభాషలలోగల వివిధవిశేషాలను సంపూర్ణంగా తెలియచేయవు—కాని 14 భాషల సాహిత్య చరిత్రా ఒకే సంపుటంలో అందించే ప్రయత్నం ఇంతవరకూ తెలుగులో—నా తెలిసినంతవరకూ జరగలేదు. అందువలన నేనీ గ్రంథాన్ని తెనిగించియున్నా. ఇందులో కొన్నికొన్ని భాషలచరిత్ర అసమగ్రమూ సందేహగ్రస్తమూకూడా. అందులో ప్రత్యేకించి తెనుగు విషయంలో చాలామందికి అభిప్రాయభేదాలు ఉండవచ్చు. ఆభేదాలను ఎంచేపని అనువాదకునిది కాదని నేను మూలాభిప్రాయాన్నే అనుసరించినా. మొత్తంమీద 14 భాషలసాహిత్యాన్ని సమీక్షించి పెక్కు-విషయాలను ఈగ్రంథం అందజేసి — తెలుగు పాఠకులలో నవ్యచైతన్యాన్నీ; జాతీయభాషాభిమానాన్నీ పుంగొల్పడంలో ఇది అద్వితీయమైనదనే నావిశ్వాసం.

మనం నేడున్న వాతావరణంలో - ఆంగ్లగ్రంథాలు పఠనీయమైనంతగా మనభారతభాషలోనే - ఈకోసనుంచి ఆకోసవరకూ ఎంతటి మహాగ్రంథాలున్నవో తెలుసుకొనే అవకాశంతక్కువ. ఇటువంటి అవకాశం ప్రథమపర్యాయంగ ఈ గ్రంథములో లభించగలదు. ఈనాప్రయత్నానికి సహకరించి ప్రోత్సాహమిచ్చినందుకు విద్యార్థిపబ్లికేషన్సువారిని అభినందిస్తూ వారికి నా ధన్యవాదాలు అర్పిస్తున్నాను.

కిర్లంపూడి
17-8-57

అనువాదకుడు,
పన్నాల వెంకటాద్రిభట్టుశర్మ.

# ముందుమాట

నేటివిద్యార్థియే భావిభారతపౌరుడగును. అట్టి విద్యార్థులు సత్పౌరులుగ తయారయినచో దేశము ఉన్నత స్థితి యందుండును. వారి మనోవృత్తుల కనువగుపద్ధతిని నీతులను, విజ్ఞాన విషయములను, విశేషములను కథాపద్ధతియందు ప్రచురించి వారి జ్ఞానోపార్జన అనురక్తితో కూడిన విధమున జరుగుటకే మేము 'విద్యార్థిప్రచురణ'లను ప్రారంభించి కృషిచేయుచున్నాము. విద్యార్థికులందరును మా కృషియందు చేయూతనిచ్చి, తమతమ రచనలను మాకు పంపినచో సంతోషముతో మేము వాటిని స్వీకరించి ప్రచురింతుము. ఇదివరలో తమ రచనలను మాకిచ్చిన మహనీయులకు కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాము.

అనేకమంది విద్వాంసులు, పండితులు తమ అనుభవ సారములను సందేశములను ప్రజల కందించుట తమ విధి, ధర్మము, అని తెలిసియు, అనేక కారణాంతరములవలన ప్రజల ముందు పెట్టజాలకున్నారు. వారిభావములు వారియందే వారితోడనే మరుగుపడిపోవుచున్నవి. అందులకు గ్రంథములను ప్రచురించుట యందుగల సాధక బాధకములు నెదుర్కొనుటకు తగిన సావకాశములు లేకుండుటయేనని చెప్పవచ్చును.

అట్టివారికి ప్రోత్సాహమిచ్చుటకు మేము ముందరకు వచ్చుచున్నాము. మాకు తగిన చేయూతనిచ్చి మాతో సహకరింపగలందులకు మా ప్రార్థన.

ఇట్లు

ప్రచురణకర్తలు

# *Acknowledgements*

This book is translated from the "Chaturdasa Bhasha Parishad" published by Bihar Rashtra Bhasha Parishad - Patna - 3. I am giving my hearty congratulations and acknowledgements to Bihar Rashtra Bhasha Parishad, which has given permission to translate this book in English and Telugu, according to the letter d / 12—6—58. In this respect my hearty congratulations to Sivapujan Sahay, Sanchalak, and Ajit Narayan Sinha 'Tomar' Karyalaya Sachiv of Bihar Rashtra Bhasha Parishad. Patna - 3.

Translator
P. V. BHATTA SARMA
17—8—58

# విషయసూచిక



వ్యాసకర్త:

శ్రీ కేదారనాథ శర్మ 'సారస్వత్'

(సంస్కృత రత్నాకరం అను పత్రికకు సంపాదకులు)

# భారతీయ భాషల కథలు.

## 1. సంస్కృతము

సంస్కృతము అమరభాష. భారత దేశంలో నే కాక, సమస్త ప్రపంచంలోనూ అతి ప్రాచీనమైనభాష. మానవ సంస్కృతికి సభ్యతకూ మిక్కిలిగా సహాయకారియైనభాష ఇది. ప్రపంచంలోని ఆర్యభాషలన్నీ ఈ మూల ప్రవాహం నుండే ఉత్పన్నమయ్యాయి. కొందరు పాశ్చాత్య విద్వాం సులు కేవలం ఊహగానంతో హేత్వాభాసల ఆధారంతో, తులనాత్మక భాషా విజ్ఞానమనే ఆడంబరంతో సంస్కృత భాష పూర్వ దిగ్భాషల కాదిజననియైనదని నిరూపించ యత్నించారు. కాని నిరంతర పరిశోధనలవలన సంస్కృతం ఆసియాలోని ఆర్యభాషలకే కాక పాశ్చాత్య భూఖండంలోని గ్రీకు, లాటిను, ఇంగ్లీషు, జర్మని, రష్యా భాషలకుకూడా ప్రాణదాతయే నని నిరూపితమైనది.

తూర్పుఖండాలలో అనేకభాషలు, భారత దేశంలో ప్రాంతీయభాషలన్నీ ఈ మూల ప్రవాహంనుండి ఉత్పన్న మైనవే. భారత దేశంలో ద్రావిడభాషల మూలపద్ధతి సంస్కృతానికి భిన్నమైనా, వానిలో ఎక్కువ పదాలు సంస్కృ తానికి చెందినవే.

ప్రపంచంలో మొట్టమొదటి పుస్తకమైన ఋగ్వేదం సంస్కృతంలోనేఉన్నది. (దీనిని సనాతనులు అపౌరుషేయం అంటారు) నవీన విమర్శకుల దృక్పథంలో ఋగ్వేద నిర్మాణ కాలం 8000 కు పూర్వము. ఆసమయంలో ప్రపంచంలోని పెక్కుభూభాగాలలో నివసించే మానవులు సంకేతాలద్వారా తమ మనోభావాలను వ్యక్తంచేసేవారు. నాటి భారతీయ మహర్షులు ప్రకృతిలోని గూఢరహస్యాలను ఆధ్యాత్మిక తత్త్వాలను క్షుణ్ణంగా విమర్శించి ఋక్కులరూపంలో వ్యక్త పఱచారు.

పారశీకభాష, వాయువ్య సరిహద్దు ప్రాంతంలోను, ఆఫ్ ఘనిస్తాన్‌లోని పస్తోభాషకూడా సంస్కృతభాషనుండే జన్మిం చాయి. సిలోన్‌లోని సింహాలీ భాష సంస్కృతపుత్రికే. సువర్ణ ద్వీపం (ఇండోచైనా) 6, 7 వందల సంవత్సరాలు భారత రాజుల పాలనలోనున్నప్పుడు దాని రాజభాష సంస్కృతమే. కాంభోజం (కంబోడియా) చంపా (ఫ్రెంచిఇండోచైనా) జావా, సుమిత్రా, మున్నగు ద్వీపాలభాషలు సంస్కృతం నుండే జన్మించి దేవ నాగరీలిపికే వాడుక చేసేవి. ఈ దేశాల సంస్కృతీ, సాహిత్యవికాసం సంస్కృతంద్వారానే జరిగింది.

ఈ దీవుల్లో కొన్ని శతాబ్దులపాటు హిందూరాజుల పాలనలో మనుస్మృతి, కౌటిల్యుని అర్థశాస్త్రం ఆధారంగా రాజ్యాలుఉండేవి. కౌటిల్యుని అర్థశాస్త్రాన్ని ఆధారంగా చేసికొని తయారైన కామందకీయ నీతిసారం అనే రాజ

నీతిలో ప్రసిద్ధమైన పుస్తకానికి మూలప్రతి జావా దీవిలో లభించింది. దాన్ని భారతదేశంలో ప్రచురించారు. జావా దీవిలోని శాసనాలు చక్కని గద్య పద్యాల్లో ఉన్నాయి. నేటికి ఈదీవుల్లో మఠాలు, మందిరాలు, నాటకాలు, గ్రామీణనృత్యాలు, జానపదగాథలు, వాని పేర్లలోకూడా రామాయణ మహాభారతాల ప్రభావం పూర్తిగా కనుపడుతుంది.

పారశీక ధర్మగ్రంథ "అవస్త" అనే గ్రంథాన్ని భారతీయుడైన జరదస్త్రముని వైదిక భాష కపభ్రంశ రూపంలో వ్రాశారు. నేటికీన్ని ఇరానీలో ప్రాచీన భారతీయ పరంపరలు, సంప్రదాయాలు, ప్రచారంలో ఉన్నాయి. వారి మంత్రాలలో దేవతలు, ఋగ్వేదాన్నిపోలి ఉంటారు. ఈవిధంగా పెక్కుభాషలకు మూలరూపమైన ప్రాచీన సంస్కృతంలో గొప్ప గుణాలు విశేషాలు ప్రపంచంలో ఏభాషలోనూ లేనివి ఉన్నాయి.

సంస్కృతంలో స్థిరత్వమన్నది ఒక గొప్పగుణం. రెండు మూడువేల సంవత్సరములక్రిందట వికసించిన గ్రీకు, రోమను, హిబ్రూ మొదలైన పాశ్చాత్యభాషలు పాళీప్రాకృతం మొదలైన భారత భాషలు కాలప్రభావానికి లోబడి నశించాయి. కాని సంస్కృతం ఋగ్వేదం మొదలు నేటి దాకా మార్పులేని రూపంతో భారతదేశమంతటా ఏకసమానంగా వ్యవహారంలోఉన్నది. నేటికి స్వల్పమే కావచ్చు.

సంస్కృతంలో నవ్యవాఙ్మయ సృష్టి జరుగుతూన్నది. పత్రికలు వెలువడుతున్నాయి. నాటకాలు ప్రదర్శనలో ఉన్నాయి.

పాలీ ప్రాకృతభాషలో ఉన్న బౌద్ధ జైన వాఙ్మయాలు పరిశోధనలకు మాత్రమే పరిమితమైనాయి. కాని సంస్కృతంలోని సాహిత్యం నేటికీ విశ్వవిద్యాలయాలలో పఠ్యభాగాలుగా ఉన్నది. చరకుడు, ఆర్యభట్టు, కాళిదాసు, శంకరాచార్యాదులు తమ గ్రంథరచనలను తమ కాలంలోని ప్రాంతీయ ప్రాకృతభాషలలో రచించి ఉన్నట్లైతే మనకు ఆ అనుపమవిజ్ఞానం లాభదాయకమయ్యేదికాదు. వారి రచనలకింత విశ్వ విఖ్యాతి వచ్చియుండేదికాదు. మహాకవి గుణాఢ్యుడు క్రీస్తుపూర్వము శివ శతాబ్దములో పైశాచీభాషలో లక్ష శ్లోకాలు రచించిన బృహత్కథ నేడు నామమాత్రావశిష్టమైంది. కాని సంస్కృతంలో దాని అనువాదాలైన బృహత్కథామంజరి, కథాసరిత్సాగరం ఉండటం వలననే బృహత్కథకు ప్రశస్తి నశించలేదు.

సంస్కృతభాషకు అనంతమైన పదజాలంవుంది. ఈ భాషలో పదాలకు వ్యుత్పత్తిని కల్పించే విధానం చక్కనిది. దీనివలన ఆవశ్యకతనుబట్టి ప్రత్యేకవిషయాలలో నవీనపదాల సృష్టి సరళంగా సాధ్యమౌతుంది. ఈకారణంచేతనే ఈభాషలోను ఈ కుటుంబానికి చెందిన భాషలలోను శబ్దాలకు దారిద్ర్యమువుండదు.

వివిధ దశలనూ, ప్రసంగాలనూ, వస్తువులనూ, భావాలనూ, రసాలనూ వర్ణించాలంటే ఆయాఘట్టాలకుతగిన అత్యు

రాలూ, శబ్దాలూ, క్రియలూ, ఉపయోగించే సౌకర్యం ఒక్క సంస్కృతంలోనే వుంది. ఒక్కొక్క ఉపసర్గతో అవ్యయంద్వారా విశేషార్థాలు సాధించడం ఇందులోనే సాధ్యం. ఏకథలో పాత్రకైనా ఏకారణంచేతనైనా పెదవి లేకపోతే ఓష్ఠ్యవర్ణాలు ఆపాత్రచేత ఉచ్చరింపచేసే వీలులేకపోయిన సందర్భాలలో విద్వాంసుడైన కవి ఆ పాత్రచెప్పే దీర్ఘసంభాషణలన్నింటిలో ఓష్ఠ్యాక్షరాల ప్రయోగం రాకుండా చేయగలడు. కొన్ని రాజదర్బార్లలో వ్యావహారిక సంభాషణలలో కూడ టవర్గవంటి కఠినాక్షరాలు కర్ణకఠువుగా కిండా నిషేధించే సంస్కృతంలో సంభాషణలు సాగించేవారట. ఇట్టి స్వాతంత్ర్యం, సౌలభ్యం అవసరాన్నిబట్టి పదాలకు తగిన ప్రయోగం సంస్కృతంలో తప్ప తక్కిన భాషలలో అసంభవం.

ఒకటి రెండక్షరాలతో శ్లోకమంతా రచన సాగించటం ఒకేశ్లోకంలో సందర్భయుక్తంగా రెండేసి మూడేసి కథలను ఆద్యంతాలతో నిర్వహించడం అష్టదళం షోడశదళం ద్వాత్రింశద్దళం, కమలబంధాలు, జటిలాలయిన సర్వప్రముఖబంధాలు, సంస్కృతభాషలో ఆశ్చర్యదాయకాలయిన విశేషాలు. రాఘవపాండవీయం, రాఘవనైషధీయం, రాఘవపాండవ యాదవీయం మున్నగు మహాకావ్యాలు ఈ విశేషాలకుప్రమాణముగా నేటికీలభిస్తున్నవి. రామకృష్ణవిలోమకావ్యం క్రమంగా చదివితే రామకథనీ, వెనుకనుండి చదివితే కృష్ణకథనీ వర్ణిస్తుంది. ఈ కారణంగా సంస్కృతంలోకల కథ

భాండాగారమనే టంకసాలలో అవసరాన్నిబట్టి నవీనపదాలనే నాణేలను ఎల్లప్పుడూ ముద్రిస్తూనే ఉండవచ్చు.

ఇంకో విశేషమేమంటే సంస్కృతంలో ప్రతిశబ్దమూ ఏదోఒక విశేషార్థాన్ని సూచిస్తుంది. ఆ శబ్దాల వెనకాల వాని చరిత్ర వికాసక్రమం, ప్రయోజనం ఉంటాయి. ప్రతిశబ్దానికీ నిర్వచనం, వ్యుత్పత్తి విజ్ఞానపూర్వకమైన వర్గీకరణం ఉంటుంది. ఈ వర్గీకరణకే ప్రత్యేకంగా వ్యాకరణాదిశాస్త్రాలు ఏర్పడ్డాయి. ఇంగ్లీషు, తదితరభాషలలో అర్థరహితమైన శబ్దాలప్రయోగం కేవలంసంకేతంకోసం జరిగేటట్లు సంస్కృతంలో అవ్యుత్పన్నశబ్దాలకు ప్రయోగముండదు. ఉదాహరణకు సంస్కృతంలో పత్నికి పెక్కుపేర్లున్నాయి:— పాణిగృహీతి, ద్వితీయా, సహధర్మిణి, భార్యా, జాయా, దారా, వంటివి అన్నీ భార్యావాచకాలే. వీనిలో ప్రతి శబ్దానికీ విడిగాఉండే అర్థాలలో వికాసక్రమం విభిన్నావస్థలను తెలియచేస్తుంది. చేబట్టినవెంటనే పాణిగృహీతి, తరువాత ద్వితీయ, ద్వితీయయైన తరువాత ఆమె సహధర్మిణికాగలదు. సహధర్మిణీ పదవిలో గృహభారం వహించి ఆమె భార్యయగును. ఆతరువాత పురుషు డామెలో నూతనజన్మను గ్రహిస్తే జాయ జాయతే అస్యామితి జాయా. అంతిమావస్థలో కుటుంబినియైనప్పు డామెకు దారాపదవి లభిస్తుంది. (దారా స్యాత్తు కుటుంబినీ) ఈవిధంగా పత్నినుండి దారవరకు అన్నిపేర్లూ భార్యకే వర్తిస్తున్నా దశాభేదాలతో ఈ పేర్ల కన్నింటికి ప్రత్యేకార్థా లున్నాయి. ఇంతేకాక

ఈ పదాలలో దారాశబ్దం పుంలింగమూ బహువచనమూ కూడానట. దారావస్థలో పత్ని పురుషునితో సమానంగా కుటుంబ శాసనకర్త్రి కావటమే ఈ పుంలింగానికి కారణం కావచ్చు. కుటుంబంలో అందరికంటే ఆదరాన్ని సూచించేందుకే బహువచనం వచ్చి ఉంటుంది. ఇట్టి చక్కని నియమాలతో పదజాలాన్ని సృష్టించేది సంస్కృతంఒక్కటే. ఈవిధంగానే మనుష్యులకు లోకము జనము, పురుషులు, నరులు మొదలయిన పర్యాయ పదాలలో మానవుల ఉత్పత్తి నుండి ఉత్తమావస్థకు చేరేవరకూ ఏర్పడిన చరిత్రఅంతా యిమిడిఉంది.

సంస్కృతంలోని స్థిరత్వం భారతదేశంలో విభిన్న ప్రాంతాలను ఒకే సాంస్కృతిక శృంఖలతో కట్టివేస్తున్నది. కాశ్మీరంనుండి కన్యాకుమారివరకూ భారతీయులను ధార్మిక సాంస్కృతిక కృత్యాలలో పూజా పద్ధతులలో సంస్కారాలలో సంస్కృతం సమాన రూపంగా వ్యవహారాలలోఉంది. నేటికీన్నీ భారతదేశంలో అన్ని ప్రాంతీయభాషలూ సంస్కృత సంతానాలు కావటంచేత తన అనంత శబ్ద భండారాన్ని ఆప్యాయంగా వానికి సమానరూపంలో ఇచ్చే అధికారం సంస్కృతానిదే. అన్నిప్రాంతాలలో, వేదాలు, ఉపనిషత్తులు దర్శనాలు, ఆయుర్వేదం జ్యోతిషం మొదలైనవిషయాలలో గ్రంథాలు, ఏకరూపంలో అధ్యయనం చేయబడుతున్నాయి. చాలాకాలంక్రింద విడిపోయిన మన ప్రాచీనఅధినివేశాలయిన సయాము, జావా, సుమత్రా, బలిద్వీపం, మొదలైన

వాసిలో సంస్కృత భాషా సాహిత్యాలద్వారా మన జీవిత విధానాలకు సంబంధముండున్నది. బలిద్వీపంలోని బ్రాహ్మణులు తమ సంధ్యావందనాది పూజా పునస్కారాలలో అవే మంత్రాలను క్రియాకలాపాన్ని నేటికీ ఉపయోగిస్తున్నారు.

ఈ కారణాలవలననే నైసర్గిక వైజ్ఞానిక శాస్త్రీయాధారాల నాశ్రయించిన సంస్కృతం నేటికీ వేలకొద్దీ సంవత్సరాలనుండీ శాశ్వత రూపంలో జీవింపగలిగింది ప్రపంచంలో ఉత్తమభాషలైన గ్రీకు మొదలైనవి గ్రీకు మొదలగువాని సభ్యతలకు సంస్కృతికీ వికాసదాయకములైనా నేడు కాల గర్భంలో విలీనమైపోయాయి. కాని సంస్కృతభాష నేటికీ సుదృఢంగాఉంది. పదివేల సంవత్సరాల దీర్ఘకాలంలో భారతదేశంపైన పెక్కువిదేశాల ఆక్రమణలు జరిగాయి. కాని సంస్కృతం భూతవర్తమానాలను కలుపుతూ ప్రాచీన కాలంనుండీ విశాలభారతంలో మూల మూలలా ప్రకాశిస్తున్నది.

ఈభాషలో శాస్త్రీయమైన ఉచ్చారణపద్ధతి ఉండడం ఒక గొప్పవిశేషం. స్వరశాస్త్ర రహస్యాలను ఆకళించుకొన్న భారతీయముని సమూహం నాద విజ్ఞానాన్ని పరిశోధన చేసినది. వారు నాద బ్రహ్మోపాసకులు. ఈ కారణంచేతనే వారి గద్య పద్యమయ వాణిలో ఛంద సౌందర్యం సందర్భ స్వారస్యంఅంతర్గర్భితాలయినాయి. పాశ్చాత్యవిద్వాంసుడైన E. H. జోన్స్టన్—"ప్రాచీనభారతీయవిద్వాంసులకు నాదంలో

ధ్వని తరంగాలలో అసాధారణమైన అతి సూక్ష్మజ్ఞానం ఉన్నది. శబ్దోచ్చారణకూ వాని అర్థ సంయోజనకూగల అలౌకికానందం సంస్కృతంలో ఉత్పన్నమైనట్లు అన్యభాషా సాహిత్యంలో అసంభవం" అన్నాడు.

ఉచ్చారణ సంబంధమైన నియమాలతో స్వరశాస్త్ర నిర్మాణం జరిగి ఉండకపోతే నేడా సముస్తవైదిక వాఙ్మయం సహజరూపంలో మనకు ప్రాప్తించి ఉండేది కాదు. లేఖన సంప్రదాయంలేని ఆరోజుల్లో వేల సంవత్సరాలవరకూ వంశ పరంపరద్వారా గురుముఖంగా కేవలం స్మరణ శక్తి ఆధారంగా సురక్షితమైంది సంస్కృతం.

నేటికీ వేదపారాయణం అదే స్వరంతో లయతో గమనంతో అదే ఉచ్చారణ పరంపరద్వారా వేలకొద్దీ సంవత్సరాలనుండీ ప్రచలితమై వస్తున్నది.

ఇంతేకాకుండా మన విజ్ఞాన సర్వస్వం ఈభాషలో అంతర్గతమైఉంది. మహర్షుల ఆధ్యాత్మికజ్ఞానం వ్యాస కపిల గౌతమాదుల సాటిలేని దార్శనిక తత్వవిజ్ఞానం వాల్మీకి కాళిదాస భవభూతి ప్రముఖుల అమర కావ్యాలు చరక సుశ్రుత ఆర్యభట్టు వరాహమిహిరాదుల ఆయుర్వేదజ్యోతి శ్శాస్త్ర విజ్ఞానాలూ సృష్టినుండి ప్రళయంవరకూగల చరిత్ర చెప్పే పురాణాలూ, అర్థశాస్త్ర ధర్మశాస్త్రాలూ, వేల సంవత్సరాలనుండీ నేటివరకూ ఆర్యజాతిని శాసిస్తున్నవి. వాస్తుశాస్త్రం కళా విజ్ఞానాలూ, వేల సంవత్సరాలనుండీ

వచ్చే ఆర్య సంప్రదాయాల ఇతిహాసం ఈ భాషలోనే సురక్షితమైఉంది. ఇందులోనే భారతదేశపు ఆత్మయొక్క పవిత్రచిహ్నాలు మనకులభిస్తున్నాయి. ఇదే మన గౌరవానికీ, గర్వానికీ, ప్రపంచంలో మనపై శ్రద్ధ ఉండడానికీ ఆధారం. సంస్కృత మహత్వాన్ని ప్రదర్శించే విషయాలను మన ప్రధానమంత్రి పండిత జవహర్‌లాల్ నెహ్రూగారి మాటలతో ఉపసంహరిస్తాము.

"భారతదేశంలో అన్నిటికంటె విశాలసంపత్తి ఏమిటనీ, ఉత్తరాధికారరూపంలో మనకు లభించిన వస్తువేమిటనీ నన్నడిగితే ఈ సంపత్తి సంస్కృత భాషాసాహిత్యంలో అంతర్గతమైయున్న మూలధనమేనని నిస్సందేహంగా నేను జవాబు చెబుతా"నన్నారు, శ్రీ నెహ్రూ.

సంస్కృతభాష సామాన్యజనుల వ్యవహారంలో ఎన్నడూ లేదని సభ్యసంఘం పరిష్కరించుకొన్న సాహిత్యభాషయే సంస్కృతమని పాశ్చాత్య విద్వాంసులూ వారి ననుసరించే భారతీయ విద్వాంసులూ అభిప్రాయపడుతూన్నారు. ప్రాకృతమంటే ప్రకృతిలో ప్రచలితమైన స్వాభావిక భాష అనీ సంస్కృతమంటే సంస్కారముపొందిన భాష అనీ వ్యుత్పత్తి చెప్పి ఈ భాషలపేర్లే ఈ విషయాన్ని స్పష్టంచేస్తున్నాయంటారు వీరు.

ఈ విషయంలో విశేష విమర్శ చేయకపోయినా ఈ మాత్రం చెప్పవలసినఅవసరం ఉంది. ఏమంటే రామాయణ

కాలానికి పూర్వం వైదిక లౌకిక సంస్కృతాలకు భిన్నమైన ఏ భాషా ఉన్నట్లు కన్పించదు. రామాయణంలో లంకయందున్న సీతకు సందేశమిచ్చే సందర్భంలో హనుమంతుడు "నేను ద్విజులవలె సంస్కృతంలో సంభాషిస్తే సీతాదేవి నన్ను వానర రూపంలో ఉన్న మాయావి రావణుడనే అని భయభీతురాలు కావచ్చు" అంటాడు. దీన్నిబట్టి ఆ సమయంలో ఉన్నత కులాలవారి మాతృభాష సంస్కృతమనీ నిమ్నశ్రేణికి చెందిన వ్యక్తులూ ఆరణ్యకులూ అసంస్కృతభాషను వ్యవహరిస్తున్నారనీ మనం ఊహించవచ్చు.

దీన్నిబట్టి ఉన్నత కులాలవారు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు సంస్కృతంలో వ్యవహరించేవారనీ రాజభాషా రూపంలో సంస్కృతమే వాడుకలో ఉన్నదనీ ఈ భాషను వాడనివారుకూడా దీనిని చక్కగా తెలుసుకోగలరని మనము పై దృష్టాంతాన్నిబట్టి ఊహింపవచ్చు. ఇంకా ఈవిషయంలో సంస్కృతనాటకాలు చక్కని ఉదాహరణాలు. దీనిలో ఉత్తమ పాత్రలు సంస్కృతంలోనే సంభాషిస్తాయి. తక్కినపాత్రలు సంస్కృత సంభాషణ నర్థంచేసికొని తమ ప్రాకృతాల్లో జవాబిస్తాయి. నేటికీ ఈరకం విభేదం ఒకే భాషలోనే తరతమ భేదాలలో కన్పిస్తుంది.

క్రీ. పూ. 7 లేక. 8 వ శతాబ్దులలోని యాస్కుడనే భాషా విజ్ఞాన శాస్త్రజ్ఞుడు తన నిరుక్తంలోనూ, కొద్దికాలం తరువాతి పాణిని మహర్షి తమ వ్యాకరణ శాస్త్రంలోనూ, సంస్కృతానికి "భాష" అనే పదాన్ని ప్రయోగించారు;

వైదికభాషగాక తక్షినసంఘంలో ప్రచలితమైన వ్యావహారిక భాషకు వ్యాకరణాన్ని పాణిని మహర్షి సంస్కృతంలోనే రచించారు. ఆకాలంలో వ్యావహారికమైన భాష పాణినిచే సంస్కరింపఁబడి పరిష్కృతమై సంస్కృతభాష యనిపించు కొన్నదని కొందరి అభిప్రాయం. పాణిని మహర్షి తనకాలపు వాడుకభాషకే వ్యాకరణం వ్రాసియున్నారు. అది వాడుక భాష కాకపోతే దానికంత విస్తృత వ్యాకరణం అవసరమై యుండేదికాదు పాణిని ముని తరువాత వరరుచి మహర్షి వార్త్రిక రచనలలో నవీన పదాలను సంస్కరించారు. దీనికి కారణం ఆసమయంలో వ్యావహారికభాషలో నవీనపదాలు వాడుకలోనికి రావడమేననీ అట్టి నవీన పదాలు పాణిని ముని కాలంలో ప్రచలిత పదాలు కావనీ అనవలసిఉంది.

పాణిని ముని కాలంలో యవనానీశబ్దం యవనవనితకే ఉపయోగించేవారుకాని వరరుచి ముని సమయంలో ఆ పదం యవనుల లిపికికూడా వాడుకలోనికి వచ్చింది. కాబట్టే వారు "యవనా ల్లిప్యాం" అనే వార్త్రికాన్ని వ్రాసి ఆ పదాన్ని నిర్ణయించారు. ఈవిధంగా వార్త్రికాలద్వారా పెక్కు నవీన శబ్దాలను పరిశోధించి వర్గీకరణచేయడం సంస్కృతానికిగల వ్యవహారోపయోగాన్నీ ప్రగతినీ సూచిస్తున్నది.

వరరుచి ముని అనంతరం పతంజలి మహర్షి పుష్య మిత్ర సార్వభౌముని శాసనకాలంలో పాణినీయ సూత్రాలకు విస్తారమైన భాష్యం వ్రాశారు. ఆ భాష్యం మిక్కిలి

ప్రామాణికం కావటంవలన మహాభాష్యం అను గౌరవ పదంతో సుప్రసిద్ధమైంది. ఇందలి భాష బహుముఖమైన లౌకిక భాషకు ఉదాహరణ. వీరు సమకాలిక లోక వ్యవహారంలో వచ్చే నవీన పదాలను జాతీయాలను శ్రద్ధగా సంగ్రహించి సంస్కరించారు. సారథికీ వైయాకరణికీ జరిగిన సంవాదంద్వారా మహాభాష్యంలో వైయాకరణుల కంటె రాత్రింబవళ్ళు భాషావ్యవహారం జరుపుతుండే సారథి సాధుశబ్దాలను ఉపయోగిస్తాడని చేర్కొన్నారు. శిష్టజనులు వ్యవహారంలో ఏశబ్దాలు ప్రయోగిస్తారో అవికూడా ప్రామాణికములనీ, సాధువులనీ, మహాభాష్యకారులు స్పష్టంగా స్వీకరించారు. దీనినిబట్టి సంస్కృతం పతంజలిమహర్షి సమయంలో వ్యవహారికభాషేనని సిద్ధిస్తున్నది. అయితే అది శిష్టజనసమాజానికిమాత్రం పరిమితంకావచ్చు. క్రీస్తుపూర్వం రెండవ శతాబ్దివరకు ఈవిధమైన స్థితి సంస్కృతానికి కలదు. క్రీస్తుశకారంభంలోను, తరువాత నొకటిరెండు శతాబ్దులవరకు ఈ భాషలకు వ్యవహారం ఉన్నట్టు కనబడుతున్నది. సాహసాంకచక్రవర్తి అంతఃపురంలో సంస్కృతమే మాటాడవలెననే నియమం ఉన్నట్లు రాజశేఖరకవి ఉల్లేఖించారు. అనేక శతాబ్దాలవరకు అఖిలభారతీయ సభలలో, ఉత్సవాలలో, న్యాయాలయాలలో సంస్కృతమే కార్యనిర్వాహభాషగా ప్రయుక్తమవుతూండేది.

క్రీ. పూ. మూడవశతాబ్దిలో కౌటిల్యుడు చంద్రగుప్తుని శాసనవిధానాన్ని సంస్కృతంలోనే వ్రాసియున్నాడు.

ఆతరువాతకూడా ధర్మశాస్త్రం మొదలయిన సమస్త వ్యావహారిక శాస్త్రాలనిర్మాణం సంస్కృతంలోనే జరుగుతుండేది.

పాణిని ద్వారా వ్యాకరణ నియమాల శృంఖలాలు పెనవేసికొనిపోయిన కారణంచేత సంస్కృతభాషాగతి అవరుద్ధమైందనీ పాణిని వ్యాకరణశాస్త్రం నిర్మించి సంస్కృతాన్ని సీమాబద్ధ మొనరించాడనీ కొందరుఅభిప్రాయపడుతున్నారు. కాని యిది సముచితంగా తోచదు. వాస్తవిక దృష్టితో విమర్శిస్తే పాణిని కాత్యాయనపతంజలులు సంస్కృతభాషను సువ్యవస్థితం కావించి పరిష్కరించడమేగాక సంస్కృతములోని అమూల్య జీవితాన్ని రక్షించి దాన్ని స్థిరమైన ఉన్నతస్థానానికి చేర్చి అలంకరించే మహాప్రయత్నం చేశారని అంగీకరించకతప్పదు. లేకపోతే ఈభాషయింతమధురంగా వ్యాప్తమై నేటి లాలిత్యంలో ప్రత్యక్షమైయుండక తటస్థించకపోయేది. నేటికెంతో వికారరూపాన్నే పొందియుండేది. ఈ మునిత్రయానికి పూర్వమూ, తరువాత గూడా ఎన్నో వ్యాకరణములు వచ్చాయి. వస్తున్నాయి. కాని మునిత్రయము ఈభాషను ఉద్దీప్తంచేసి ఉత్తరోత్తరాభివృద్ధికి తీసికొని రావడంలోని ప్రతిభ వైజ్ఞానిక దూరదర్శిత్వమూ ఆశ్చర్యజనకాలు.

ఇంక సంస్కృతభాషా సంబంధమైన ప్రసంగాన్ని ముగించి ఈభాషలలోని విస్తారసాహిత్యం ఎట్టిదోచూద్దాము.

శబ్దాలకు సమానమైన సముచితమాధుర్యమేసాహిత్యం. ఈ విధంగా సాహిత్యశబ్దం కావ్య విశేషార్థము నిష్పత్తిగా

ప్రయుక్తమవుతూన్నది. రాజశేఖరులూ, వక్రోక్తిజీవితకారు లయిన భట్టకుంతకులూ "శబ్దార్థాలు ఒకదానికంటె మరొకటి ఉత్కర్షనుకానీ అపకర్షనుకానీ పొందక సమానరూపంలో ఉండే స్థితినే సాహిత్య" మన్నారు. ఇతర శాస్త్రాలలో కొన్నింట ప్రత్యేకం శబ్దమో, ప్రత్యేకం అర్థమో ప్రాధాన్యాన్ని వేరు వేరుగా పొందవచ్చును. కాని కావ్యంలో రెంటికీ సమాన ప్రాధాన్యం ఉంటుంది కాబట్టి సాహిత్యశబ్దం కావ్యవాచకమైనది. ఈఅర్థాన్నిబట్టి సాహిత్యశబ్దం కావ్యాల లోని భేద ప్రభేదాలు సమస్తాంగోపాంగాలు కూడిన గ్రంథ రాశిని ప్రతిపాదిస్తున్నది. కాని నేడు ఈ పరిమితార్థాన్ని విడిచి సాహిత్యశబ్దానికి ఏదైన భాషలోఉండే సమస్త గ్రంథ రాశికీ పర్యాయంగా వాడుక ఉన్నది. కాని యిట్టి వ్యాపక భావం వాఙ్మయమనే పదానికి సంస్కృతంలో సమంజసం కాబట్టి యిక్కడ మేము పరిమితార్థాన్ని ఇచ్చే సాహిత్యాన్ని స్వీకరించి తత్ప్రదర్శన దిఙ్మాత్రంగా చేస్తున్నాము.

సంస్కృతంలోని సమస్త శాస్త్రీయ గ్రంథరాశినీ, సంస్కృత వాఙ్మయంలో సంక్షిప్త చరిత్రనూ చూపడమైనా ఈ చిన్న వ్యాసంలో సంభవం కాదు. ఋగ్వేదకాలంనుండి నేటివరకూ ఈ వాఙ్మయంలోని గ్రంథరాశిని లెక్కించడం సంవత్సరాలకొద్ది పరిశోధించినా కఠినమే. నేటికి పెక్కు వేల సంవత్సరాలనుండీ విశాలభారతంలో వేలకొద్దీ విద్వాంసుల ద్వారా ఈ వాఙ్మయ నిర్మాణం నిరంతరం జరుగుతున్నది. ఇట్టి వాఙ్మయ విమర్శ దుష్కరమూ మహాకార్యమూ కూడా

కాబట్టి ఇక్కడ సంస్కృత వాఙ్మయంలో ఒక శాఖయైన సాహిత్య శాస్త్రాన్ని అతి సంక్షిప్తంగా పరిచయం చేయడమే మా ఉద్దేశ్యం.

సాహిత్యశబ్దానికి అర్థం కావ్యము. దీనిభేదప్రభేదాలు దానికి సంబంధించిన సామగ్రియైన రసాలంకారాలు రీతి గుణాలు, ఛందస్సు మొదలైనవన్నీ యిందులో చేరినవే.

సంస్కృత భాషకి మూలగ్రంథం వేదము. ఆధ్యాత్మిక భావనలో నిమగ్నులై ధర్మనిరతులైన భారతీయుల సభ్యతకీ సంస్కృతికీ మూల ప్రవాహమైన వేదరాశి సమస్తవిద్యలకూ మూలస్థానం. ఇందువలననే సమస్త భారతీయ వాఙ్మయం ఇదే పునాదిమీద నిల్చి ఉన్నది. సంస్కృత సాహిత్యానికి వేద రాశి లక్ష్యము. వైదిక లౌకిక రూపాలలో అంతరం మాత్రమే భేదము. ఇందుచేతనే వేదాల సంభాషణరీతి ప్రభుసమ్మితం. పురాణశైలి మిత్రసమ్మితం. సాహిత్యశైలి కాంతా సమ్మితము. వాని కన్నింటికీ లక్ష్యమొక్కటే.

సమస్త ప్రపంచం సంఘర్షమయ స్థితిలో ఉన్నా సచ్చిదానందానుభూతిని పొందడమే భారతీయసంస్కృతికి లక్ష్యము. ఇందుచేతే దీనికి బ్రహ్మానందమయ స్వరూపమైన రసమే ఆత్మ. ఈ రసమే వేదంలో—"రసో వై సః; రసగ్గ్ హ్యేవాయగ్ం లబ్ధ్వానందీభవతి (మానవుని ఆనందంలో నిమగ్నుని చేయునదే రసం)" అని ప్రతిపాదితమైనది. నాట్య వేదాచార్యుడైన భరతుడు "నహిరసాదృతే కశ్చిదర్థః

ప్రవర్తతే. (రసములేనిదే అర్థవంతము కాజాలదు) అన్నారు. రసమే కావ్యజీవితానికి ప్రాణము. అలంకారములు, గుణాలు, రీతి, ఔచిత్యమూ మొదలైన కావ్యగుణాలన్నీ రసాన్ని సాధించినవే. ఇవి రసోన్మేషానికి కారణాలు సహృదయుల హృదయాలు రస బ్రహ్మతో తాదాత్మ్యానుభావం పొందినప్పుడు సమస్త వేద్యాంతరాలు విగళితములు కాగలవు. అనగా రసాస్వాదమైనమీదట ఆ రసానికిగల సాధనాల జ్ఞానం లోపిస్తుంది. ఈ మహాలత్వాన్ని ఆధారంగా తీసికొనే సాహిత్య సృష్టిమైనది. నాట్యశాస్త్రానికి ప్రథమ ప్రవర్తకుఁడైన భరతముని సిద్ధాంతమిదే. ఈకారణంచేతనే భారతీయ కావ్యాలలో భారతదర్శనాల సంస్కృతిప్రభావం కన్పిస్తుంది. భారతీయ నాటకాలు దుఃఖాంతాలు కాకపోవడానికి ఇదే కారణం. భారతీయ సంస్కృతి ప్రపంచ పర్యవసానం దుఃఖాంతమని అంగీకరించదు. భారతీయుల దృక్పథంలో జీవితం కళ్యాణమయంగాను ఆనందమయంగానే అంతం చెందవలె. ఇతర సాహిత్యాలకూ సంస్కృత సాహిత్యానికీ విశేషమిదే.

పాశ్చాత్య సంస్కృతికి భక్తులయిన భౌతికవాదులు స్థూలదృష్టితో మనసాహిత్యాన్ని సమీక్షిస్తూ ఊహాపోహాల కల్పనాదోషాలతో కూడిన అనుమాన ప్రమాణాలద్వారా భ్రాంతిపూర్వక సిద్ధాంతాలనుసృష్టించారు. అవి మన ఆధ్యాత్మిక సంస్కృతిలోని అతిగంభీరరహస్యాలు తెలియనివారువాని అంతస్థలంలో ప్రవేశింపజాలక చేసిన సిద్ధాంతాలే అనవలె.

సంస్కృత సాహిత్యం దానిలోని భేదప్రభేదాలను అంగోపాంగాలనూ, మేళవించుకుని వాఙ్మయసృష్టిని విశాలముగా జరిపింది. భారతీయ విద్వాంసులకు నిరంతరంగా వున్న స్వభావమేమిటంటే ఏ విషయములో నిమగ్నమయినా దానిని ఆట్టుకునుండే సర్వాంగ సంపూర్ణంగా తయారుచేయడంలో ఎంతమాత్రం కొదవవుంచరు. ఇదేవిధంగా సాహిత్యవిద్య కూడా లోకప్రియమైన పద్ధతిలో సంపూర్ణవికాసాన్ని చేరియున్నది. ఈ విశాల సాహిత్యాన్ని దిఙ్మాత్రంగా చూసి దీని వికాసాన్ని చరిత్రనూ కానం ఒకసారి ఆకళింపుకోడం అవసరం.

భారతీయ సాహిత్యానికి ప్రారంభం వాల్మీకి రామాయణంతోనే అన్నది అంగీకృతమే. సంస్కృత సాహిత్య ప్రవాహ స్వరూపమైన వేదాలలో మొట్టమొదటి గీతికావ్యాలు ఉపమా రూపకాతిశయోక్తులు మొదలైన అలంకారాలు అంతర్గతమైనవే. సంవాదసూక్తాలలో నాట్యబీజాలుకూడా దృష్టిగోచరమవుతున్నాయి. అయినా కావ్యస్వరూపంలోని సర్వాంగ సంపూర్ణమైన సౌందర్యరూపం ప్రథమదశలో రామాయణ రూపంలోనే సాక్షాత్కరిస్తున్నది. రామాయణం సంస్కృత భాషలో మొదటి మహాకావ్యం. అందులో భారతీయుల సంస్కృతికీ, సభ్యతకూ వికాసరూపం స్పష్టంగా గోచరిస్తున్నది. రామాయణం ఆధారంగానే సంస్కృతసాహిత్యంలో శతాధికములైన కావ్యాలూ, నాటకాలూ వచ్చినవి. పెక్కు పురాణాలలో మహాభారతంలోనుకూడా రామాయణం ఆధా

రంగానే రామకథవర్ణితమైనది బౌద్ధగ్రంథాల చీనా టిబెటు భాషల అనువాదాలలోనూ, బౌద్ధ, జైన గ్రంథాలలోను గూడా రామాయణప్రభావం కన్పిస్తూంది. ప్రపంచ రచనలలోనే రామాయణకథ బహుజనామోదాన్ని పొందింది. రామాయణానికి అంతర్జాతీయమహత్త్వం వున్నది. ఏవిధంగా ఋగ్వేదానికి వైదికవాఙ్మయంలో సర్వప్రథమమైన ప్రధానస్థానం వున్నదో అదేవిధంగా లౌకికవాఙ్మయంలో రామాయణానికి సర్వోత్తమమైన స్థానంవున్నది.

రామాయణానికి తరువాతస్థానం మహాభారతానిది. దీనికి సంబంధించి "యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్క్వచిత్" (ఇందున్నదే యింకోచోటవున్నది. ఇందు లేనిది ఎక్కడాలేదు.) అన్న ఒక్క సూక్తి చాలును. మహాభారతాన్ని రామాయణంతో సమానంగా మహాకావ్యం అనజాలము కాని పెక్కుమహాకావ్యాలకు ఆధారమైనదని నిర్వివాదంగా స్వీకరించాలి. మహాభారతం వాస్తవంలో ఇతిహాసగ్రంథం.

ఈరెండు మహాకావ్యాలూ హిమాలయ వింధ్యాలయాలలో సమానంగా సంస్కృతసాహిత్యానికి నగాధిరాజాలు. వీని అక్షయ ప్రవాహాలనుండి వెలువడిన సాహిత్య సరిత్తులు వేలసంవత్సరాలనుండి భారతభూమిని సరసమొనరించాయి.

కావ్యములు రెండువిధాలు:- శ్రవ్యములు, దృశ్యములు. వానిలో శ్రవ్యకావ్యాలకు రెండు మహాప్రవాహా [illegible] దృశ్యకావ్యాలకు

ప్రధానాచార్యుడైన భరతముని కూడా సంస్కృతసాహిత్యానికి మరొక మూలప్రవాహం.

సాహిత్యాన్ని విర్శించే లక్షణగ్రంథాలలో మొట్టమొదటిది భరతనాట్యశాస్త్రము. నాట్యశాస్త్రానికి ముఖ్య విషయం దృశ్యకావ్యము. భరతముని - శ్రవ్యకావ్యాలకు సంబంధించిన రసాలంకారాలు, గుణాలు, వృత్తులు, ఛందస్సు, నాయికాభేదాలు కావ్యదోషాలు అన్నీ విశదంగా విమర్శించకపోయినా, అనేక అధ్యాయాలలో వీటిని సంగ్రహంగా వెల్లడిచేసినారు. భరతముని తరువాతి ఆచార్యులు ఈ విషయాలను విస్తరించి విమర్శించినారు.

పైన పేర్కొన్న మూడు సాహిత్యశాస్త్రప్రవాహాలకు ప్రవర్తకులయినవారి సమయం మున్నగు విషయాలలో పాశ్చాత్యులూ, వారి ననుసరించే భారతీయ విద్వాంసులూ పెక్కు నిర్ణయకల్పనలు చేసియున్నారు. అవి చాలావరకు అప్రామాణికాలూ, వివాదాస్పదాలూను. రామాయణం మహాభారత రచనానంతరం వెలువడినదనీ, ఈ రెండు ఉద్గ్రంథాలూ బుద్ధుని అనంతరమే వచ్చిన రచనలనీ, ఇట్లాంటి కువిమర్శలు చాలా ఉన్నవి.

మహాభారతం తరువాత క్రీస్తుశకం ప్రారంభమయ్యే వరకూగల మధ్యయుగంలో సాహిత్యప్రగతి అనేక ధార్మిక రాజనైతిక పరిస్థితులు కారణంగా మందగించింది. లౌకిక సంస్కృతంలో కావ్యసృష్టి జరుగగలంతటి లాలిత్యం, మాధుర్యం ఇంకా అప్పటికి ఏర్పడియుండలేదని పాశ్చాత్య

విద్వాంసుల అభిప్రాయం. కాని క్రీస్తుకి పూర్వం 6వ శతాబ్దంలో పాణినిమహర్షి వ్యాకరణశాస్త్రనిర్మాణానంతరం "జాంబవతీ విజయం" లేక "పాతాళ విజయ"మనే కావ్యాన్ని రచించినారు. ఈ కావ్యం నేడు లభించకపోయినా, కొన్ని శతాబ్దాలకు పూర్వం ఈకావ్యం ఉన్నట్లుగా క్రీ. శ. 9వ శతాబ్దంలో రాజశేఖరులు ఆ కావ్యాన్ని ప్రశంసించడాన్ని బట్టి మనం చెప్పవచ్చు. క్రీ. శ. 10వ శతాబ్దంలో క్షేమేంద్రులు పాణిని కృతకావ్యంలోని ఉపజాతి వృత్తాన్ని ప్రశంసించారు. రుద్రటుల కావ్యాలంకారానికి గల టీకను బట్టీ, అమరకోశ టీకనుబట్టీ, వారి కావ్యాలచర్చ ననుసరించీ పాణిని ముని కవియైనట్లు ప్రమాణాలున్నవి.

పాణినికి కొద్ది ఈవలివారైన వరరుచిముని "కంఠాభరణ" మనే కావ్యాన్ని రచించినట్లు రాజశేఖరుని వ్రాతలో తెలుస్తున్నది. పుష్యమిత్రునకు సమకాలికులయిన పతంజలి మహాముని "వారరుచం కావ్యం" అనే ప్రయోగాన్ని మహాభాష్యంలో ఉల్లేఖించినందున వరరుచి కవియైనట్లు స్పష్టము. సుభాషిత గ్రంథాలలో వరరుచిశ్లోకాలు చాలాకన్పిస్తున్నవి. ఆ శ్లోకాల కవిత్వం చూచినట్లయితే వరరుచికిగల ఉత్కృష్ట కవితాశక్తికి పరిచయం లభిస్తుంది.

పతంజలిమహాముని భాష్యంలో అనేకశ్లోకపాదాలనూ కంసవధ, బలిబంధం మొదలయిన నాటకాలనూ, వాసవదత్త సుమనోత్తర, భైమరథి అనే ఆఖ్యాయికలనూ, ఉల్లేఖించినారు. పాణిని సమకాలికుడయిన పింగళుడు ఛందశ్శా

స్త్రంలో కావ్యోపయుక్తాలయిన లౌకిక ఛందస్సులు పెక్కింటికి లక్షణం నిరూపించియున్నాడు. ఈ ఛందస్సే తరువాతి కావ్యాలలో వాడుకయైనది. కావున సంస్కృత సాహిత్యానికి ఉదయకాలం క్రీస్తుకి చాలా శతాబ్దులకు పూర్వమే జరిగియున్నదని నిస్సందేహంగా చెప్పవచ్చు.

విక్రమార్క సమకాలికులయిన కాళిదాసమహాకవి భాస, సౌమిల, రామిల, కవిపుత్ర ప్రముఖ కవులను ఉల్లేఖించినారు. కాబట్టి భాసాదులు కాళిదాసులకంటె ప్రాచీనులే. క్రీ. పూ. 200-250 ప్రాంతపు శిలాశాసనాలలో లలితములయిన సంస్కృత శ్లోకాలు లభిస్తున్నవి. కావున విక్రమార్కునకు పూర్వమే సంస్కృత సాహిత్యం వికాసాన్ని పొందినదనడంలో సందేహంలేదు.

విక్రమశక ప్రారంభంతో సంస్కృత సాహిత్యానికి యౌవనకాలం ప్రారంభమైనది. ఈసమయంలోసంస్కృతంతో ప్రాకృతభాషకూడా సంపూర్ణ వికాసాన్ని పొందినది. పైశాచిలోని బృహత్కథ, హాలునిగాథా, సప్తశతీ, నాటి ప్రాకృత వికాసానికి ఉదాహరణలు. ఈ సమయానికి దేశంలో సాహిత్యానికి ప్రబలప్రచారంజరిగినది. రాజులు స్వయంగా కవిత్వం చెప్పేవారు. కాబట్టే వారు కవులకు సన్మానాలుచేసి ఆదరణ చూపేవారు. "యథారాజా తథాప్రజా" (రాజులు ఎట్లా ఉంటే ప్రజలు అట్లాఉంటారు) అనే నియమాన్ని అనుసరించి ప్రజలలో సాహిత్యమంటే ప్రేమ ఉద్దీప్తమైనది. ఇదే సమయంలో సంస్కృత సాహిత్య క్షేత్రానికి సర్వోత్కృష్ట కా

కారులయిన కాళిదాసులు తమ నిరుపమాన రచనలద్వారా, మహాకావ్యాలు, ఖండకావ్యం, దృశ్యకావ్యాలూ, సంస్కృతమూ, పరిమార్జితమూ, సుస్థిరమూనైన శైలిలో నంతరించి మార్గదర్శకులై సాహిత్యక్షేత్రంలో నవ్యయుగాన్ని ప్రవర్తింపచేసినారు. వారి రచన "నభూతో నభవిష్యతి" (భూత భవిష్యత్తుల్లో లేనిది) అనే సూక్తికి వాస్తవికోదాహరణ. అశ్వఘోషుడు, భారవి, మాఘుడు, కుమారదాసు, శ్రీహర్షుడు, రత్నాకరుడు మొదలయిన మహాకవులు, ఈ శైలి ననుసరించి అభివృద్ధిచేసినారు "మేఘదూత" పెక్కుదూత కావ్యాలకూ, ఖండ కావ్యాలకూ, గీతి కావ్యాలకూ, సరస మధుర రచనలలో ఆదర్శమై ప్రోత్సాహమిచ్చింది.

స్వర్గ మర్త్యలోకాలకు మధుర సామంజస్యాన్ని కలిపించిన అభిజ్ఞానశాకుంతలం రూపకరచనలో సర్వోత్తమమైన స్థానాన్నిపొంది ఆదర్శాన్ని స్థాపించినది. ఈ కారణంవల్లనే కాళిదాసులు వాస్తవికంగా కవికులగురువులైనారు. వారు స్థాపించిన బాట నేటికీ మార్పులేక సమస్త భారతదేశంలో ఏదోరూపంతో జీవించియున్నది. గడిచిన కొన్ని శతాబ్దాల వరకూ సంస్కృతంలో మహాకావ్యాలూ గీతికావ్యాలూ వెలువడుతూండేవి.

6 వ శతాబ్దినుండి 11 వ శతాబ్దపర్యంతం కాశ్మీరం లో సంస్కృత సాహిత్యం మధురంగా ఫలించినది. ఈ సమయములో మేంధమహాకవి, రత్నాకరుడు, ఆనందవర్ధనులు, శివస్వామి, జగద్ధరభట్టు, క్షేమేంద్రులు, శంభుడు, బిల్హణుడు,

కల్హణుడు, జల్హణుడు, అభినందుడు మున్నగువారు దిగ్గజాల వలె విహరించినారు. వారు 50 సర్గలతో మహాకావ్యాలు, నూర్లకొలది గీతికావ్యాలూ నిర్మించినారు. కావ్యకళాప్రౌఢి, మాధుర్యాతిశయం, రచనలలో నాడు పరాకాష్ఠను చెందినది. ఈ కవులతో సమంగా మాతృగుప్తుడు, అవంతివర్మ మున్నగురాజులుకూడా కాశ్మీరంలో మహాకావ్యరచన చేసినారు.

సంస్కృత సాహిత్య నిర్మాణంలోనూ, తత్సంరక్షణ ప్రచారాలలోనూ, భారతీయరాజుల ప్రోత్సాహం ప్రేరణా మిక్కిలిగా లభించినవి. శూద్రకుడు, సాహసాంకుడు, విక్రముడు, హాలుడు, సముద్రగుప్తుడు, హర్షవర్ధనుడు, మాతృగుప్తుడు, కుమారదాసు, అవంతివర్మ, వాక్పతిరాజు, భోజదేవుడు, కర్ణాటకేరళాది దక్షిణభారత భూమిలోని రాజులూ స్వయంగా ఉన్నతశ్రేణికిచెందిన సాహిత్యాన్ని నిర్మించినారు. ఇంతేగాక భారతీయ మహారాజుల ఆస్థానాలన్నింటిలో తఱచుగా కవులూ పండితులూ వుంటుండేవారు.

ప్రాచీనకాలంలోని రాజాస్థానాలలో ప్రతిసంవత్సరం కావ్యగోష్ఠులూ, పరీక్షాసభలూ, జరుగుతూండేవి. నాటికి సుమారప్రాంతాలనుండి కవులువచ్చి తమ రచనలు వినిపించేవారు. ఉత్కృష్ట రచనలకు బహుమానాలు లభించేవి. సర్వోత్కృష్టులయిన సాహిత్య రచయితలకు విశేషప్రమాణ పత్రాలు నిస్తూండేవారు. వారిని బ్రహ్మరథంపట్టి ఊరేగించేవారు. రాజశేఖరులు యిట్టిసభలను పేర్కొన్నారు. పాటలి

పుత్రింలో పాణిని, వరరుచి, పతంజలి ప్రముఖుల పరీక్షా, ఉజ్జయినిలో కాళిదాస, సూరామరసింహ, భారవి ప్రముఖుల పరీక్షలూ, బహుకూనాలూ రాజశేఖరులు పేర్కొన్నవే. ఇటువంటి సమ్మేళనాలద్వారా దూరదూరాల సాహిత్యకారులొక్కచోట సమావేశం కావడమూ, వారి రచనలు అతి త్వరితంగా ప్రచారాన్ని పొందడమూ జరుగుతూండేది. ఈ కారణంవలననే కేరళంనుండి కాశ్మీరంవరకూ నవ నవోన్మేషితమైన సాహిత్యానికి ప్రచారం జరుగుతూండేది.

కవులు మాత్రమే కాక సాహిత్యశాస్త్రంలో మహాచార్యులయి ఆనందవర్ధనులూ, అభినవ గుప్తాచార్యులూ, వామనరుద్రటరుద్రక ప్రముఖులూ, వక్రోక్తి మార్గప్రవర్తకులయిన భట్టకుంతకులూ, మమ్మట మహిమ భట్టాది సాహిత్య దర్శనాచార్యులూ తమ గంభీర పరిశోధనలనూ, అఖండ పాండిత్యం ఆధారంగా సాహిత్యాన్ని దర్శనాలతో సమంగా గంభీర శాస్త్రకోటికి తీసుకొనివచ్చి సాహిత్య గౌరవాన్ని అభివృద్ధిచేసినారు కాశ్మీరంలో సారస్వతకవులు సంస్కృత సాహిత్యాన్ని బాహ్యాభ్యంతర రూపాలలో ప్రౌఢంగా మధుర మధురంగా చేయడంలో సంస్కృత సాహిత్యోత్కర్షను పెంచడంలో అందరికంటె ఎక్కువగా కృషి చేసినారు.

800 నుండి 1100 వరకూ కన్యాకుబ్జంకూడా సాహిత్య కేంద్రంగా ఉన్నది. ప్రధానంగా మహాకావ్యాలు రచించిన

యశోవర్మ, మహేంద్రపాల మహీపాలాది రాజులకాలంలో ఇక్కడ భవభూతి రాజశేఖర, వాక్పతిరాజ, ఆర్యక్షేమీశ్వర ప్రముఖులూ, ప్రఖ్యాతదార్శనికుడయిన శ్రీహర్ష మహాకవీ మున్నగు విద్వాంసులు ఉన్నత శ్రేణికి చెందిన దృశ్యకావ్యాదులద్వారా సాహిత్యానికి మహనీయమైన సేవ చేసినారు. ఉత్తర రామచరిత్ర, మాలతీ మాధవం, బాలరామాయణం, కర్పూరమంజరి, విద్ధశాలభంజిక, చండకౌశికంవంటి ఉత్తమ నాటకాలూ, నైషధీయచరిత్ర మున్నగు అద్భుత మహాకావ్యాలు ఈ కాలాన సాహితీ ప్రపంచంలోవచ్చిన ఉన్నత శిఖరాలు.

బెంగాలులో సేనవంశ రాజుల సమయాన, గోవర్ధనాచార్యులు, జయదేవ మహాకవి, ధోయీ, కవిరాజు, శరణుడు మున్నగు మహాకవులు - ఆర్యాసప్తశతి, గీతగోవిందం, పవనదూత మున్నగు కావ్యాలను వెలువరించినారు. ఇవి సంస్కృతంలోని గీతికావ్యాలలో నవ్యయుగాన్ని సృష్టించినవి. వీనిలో సంస్కృతభాష మాధుర్యం చరమసీమకు చేరినది.

10వ శతాబ్ది తరువాత దక్షిణ భారతంలో సంస్కృత సాహిత్యనిర్మాణం విశేషంగా ప్రారంభమైనది. వీని రచనా శైలి తక్కిన ప్రాంతాల శైలికి భిన్నమైనది. కాని మిక్కిలి ప్రౌఢమూ, ఆకర్షకమూ నిది. ఇక్కడ కొన్ని మహాకావ్యాలే కాక, ఖండకావ్యాలూ, స్తోత్రాలూ, నాటకాలూ, చంపువులూ, భాణాలూ, ప్రహసనాలూ, మున్నగు రూపక ప్రభేదాలు తగినంతగా వెలువడ్డాయి. ఈ యుగానికి చివర

వెంకటాధ్వరి, పండితరాయజగన్నాథులూ ఇంకా అప్పయ్య దీక్షితులు, మున్నగు మహాకవులూ, సాహిత్య దర్శనంలో ఉత్తమ విద్వాంసులూ ప్రసిద్ధిచెందినారు. రస గంగాధరం, కువలయానందంవంటి ప్రౌఢ ప్రామాణిక గ్రంథాలు పాండిత్య ప్రకర్షకు నిదర్శనాలు. దక్షిణదేశంలో వెలువడిన సంస్కృత సాహిత్యం అపరిమితమైనదే కాక శ్లాఘ్యమూ, గౌరవనీయమైనదీకూడా ననవలె.

11వ శతాబ్దిలో ఘూర్జరదేశంలోకూడా సంస్కృత సాహిత్యరచనా విమర్శలు జరిగియున్నవి. కాయస్థులైన సోఢల మహాకవి ఉదయసుందరీ కథనూ, వాస్తుపాలుడు రూపకసాహిత్యాన్ని ఈ శతాబ్దంలోనే రచించినారు. ఈ కాలంలో సంస్కృతాన్ని ఆదరించిన ఘూర్జర మహారాజుల ఆశ్రయంలో అనేక మహాగ్రంథాలు వెలిసినవి. ఇక్కడివారైన విద్వాంసుల కావ్యజాలం శ్లాఘ్యమైనది.

గత శతాబ్దులలోని రాజాస్థానాలు సంస్కృత సాహిత్యాన్ని నిర్మింపచేయడంలో మిక్కిలిగా సహకరించినవి. నేటికీ పెక్కు సాహిత్యకారుల రచనలు రాజాస్థానాలలోనే కానవస్తున్నవి. హమ్మీరవిజయం, పృథ్వీరాజవిజయం మొదలైన మహాకావ్యాలు ఇటువంటివే. గత శతాబ్దంలో జయపురమందలి శ్రీ కృష్ణరామకవి ప్రాచీనకవులతో సాటియైన సాహిత్యవేత్త. ఈ కవి జయపురవిలాసం మున్నగు లలితరచనల నొనరించినారు. కాని అవి నేడు లభ్యంకావు.

సాహిత్య నిర్మాణకాలానికి చరమావధి విక్రమశకం 20 శతాబ్ద ప్రారంభమనవచ్చు. 1843 క్రీ. శ. ప్రాంతం వరకూ భారత దేశంలోని భిన్న భిన్న ప్రాంతాలలో సాహిత్య సృష్టి జరుగుతూనే ఉన్నది. నేటికిన్ని ఏదో రూపంలో స్వల్పంగా నైనా సంస్కృత సాహిత్యసృష్టి జరుగుతూనే ఉన్నది.

ఈ శతాబ్దంలో భారత దేశ సుప్రసిద్ధులయిన మహా మహోపాధ్యాయ గంగాధరశాస్త్రి, తైలంగులు-అలిపిలాని సంలాపాన్ని బెంగాలులో మహామహోపాధ్యాయ, పంచానన తర్కరత్న పండితులూ, బీహారులో రామావతారశర్మపాండే యులూ, మిథిలలో పెక్కురు విద్వాంసులూ- ఉన్నత శ్రేణికి చెందిన పెక్కు దృశ్యశ్రవ్యకావ్యాలను రచించినారు

శ్రవ్యకావ్యాలలో అవాంతర భేదమైన కొన్ని స్తోత్ర కావ్యాలుకూడా సాహిత్యదృష్టిలో మహిమగలవే. రస భావాలంకార గుణాదులను పరికిస్తే ఈ స్తోత్రాలు ఉత్తమ సాహిత్యంలో స్థానాన్ని సంపాదించుకొంటాయి కాశ్మీర మహాకవి జగద్ధరభట్టు స్థానం స్తోత్రకావ్యాల రచయితలలో శ్లాఘ్యమైనది. వీరి స్తుతి కుసుమాంజలి అనే బృహత్ స్తోత్ర సంగ్రహం అద్భుత కవిత్వమయమైనది. 16 సంవత్సరాల వయసునసే ఈ శివభక్త మహాకవి ఆశ్చర్యకరమైన ప్రసాద మయ కవితతో అలౌకిక ఆనందాన్ని. అనిర్వచనీయ మాధుర్యాన్ని చేకూర్చినారు. ఇంతేకాక భట్టబాణుని చండీశతకం; మయూరుని సూర్య శతకం; శ్రీ శంకరాచార్యుల సౌందర్య

లహరీ; మూకకవి పంచస్తవం; వెంకటాధ్వరి లక్ష్మీసహస్రం; పండితరాయల లహరీపంచకం; విష్ణుభక్తి కల్పలత మొదలైనవి ఉత్తమ స్తోత్రాలు. ఇదే ఆదర్శంలో రచన సాగించిన ఆచార్య రామావతార శర్మగారి మారుతి శతకంకూడా ఈ కోటికిచెందిన ఆధునిక రచన.

దృశ్యకావ్యాలవిషయంలో వెనుక కొంత సాధారణ చర్చ చేసియున్నాము. దృశ్యకావ్యాల ఉత్పత్తి ఎప్పుడు ఎట్లా జరిగిందన్నవిషయం మిక్కిలి జటిలమూ, వివాదగ్రస్తమూ అయిన సమస్య. కొందరు పాశ్చాత్యవిద్వాంసులు భారతీయ నాటకాలపై గ్రీకు ప్రభావాన్ని సాధించడానికి మహాప్రయత్నం సాగించినారు. ఇది అన్నివిధాలా నిస్సారం, నిర్మూలం, సంకుచితాభావనాపూర్ణం కావడంచేత విమర్శనీయంకాదు. సమస్తవిద్యలకూ మూలాధారమైన వేదంలోనే సంవాద సూక్తాల రూపంలో దృశ్యకావ్య బీజాలున్నవి.

"ఊర్వశీ హాప్సరాః-పురూరవమైడంచకమే"(ఊర్వశి అనే అప్సర ఇడాపుత్రుడయిన పురూరవుని ప్రేమించెను) అనే సూక్తాన్ని ఆధారంచేసికొనే, కాళిదాసుల విక్రమోర్వశీయ రూపకరచన జరిగినది. నాట్యవిద్యను పంచమవేదంగా మనవారు అంగీకరించారు. పాశ్చాత్య విద్వాంసులుకూడా వేదకాలపు యజ్ఞాలలో నృత్యంతోబాటు సంవాద సూక్తాల నభినయించేవారని అంగీకరిస్తున్నారు.

భారతీయనాట్య శాస్త్రాన్ని అనుసరించి దేవతాసభలో త్రిపుర దాహమనేడిమమూ, సముద్రమథనమనే సమ

వాకారమూ మొదట అభినయింపబడినట్లు తెలుస్తున్నది. పాణిని మహర్షికి పూర్వమే నటసూత్రమనే గ్రంథంఉన్నట్లు తెలుస్తున్నది. పతంజలిమహాముని మహాభాష్యంలో కంసవధ బలిబంధమూ అనే నాటకద్వయాన్ని పేర్కొన్నారు.

సుమారుగా ఆకాలంలోనే వచ్చిన భారతీయనాట్య శాస్త్రంలోని అనేక నాట్యవిషయాల వివరణనుబట్టి నాటక రచన అంతకుముందు వేయి సంవత్సరాలకు పూర్వమే ఉన్నట్లు స్పష్టపడ తున్నది. ఆశాస్త్రం అంతటి వికాసాన్ని ఏ రెండు మూడువందల సంవత్సరాల్లోనో పొందియుండడం సాధ్యంకాదు.

యవనికాశబ్దాన్ని తీసికొని గ్రీకులద్వారా భారతీయ నాట్యశాస్త్రం వికాసం పొందిందని భావించే పాశ్చాత్య విద్వాంసుల కల్పనలు – అజ్ఞానంవలననూ, సంకుచిత మనో భావాలవలననూ వచ్చిఉన్నవి మాత్రమే. గ్రీకు భారతీయ నాట్యాల సంప్రదాయాల స్వభావమే భిన్నమైనది. వానికి ఎక్కడా పొంతన కుదరదు. ఇంకా గ్రీకు సభ్యతజన్మిస్తూండే సమయానికే భారతీయ నాట్యకళ తగినంతగా అలంకృతమై నిగ్గు తేరినది.

లభించిన సంస్కృత రూపకాలలో భాసనాటకాలు ప్రాచీనాలు. నేడవి 13 మాత్రమే లభిస్తున్నవి. యీ విషయంలో స్వప్న వాసవదత్తం తప్ప తక్కినవి భాసునివి కావనీ, భాసుని పేరుతో కల్పించినారనీ కొందరిఅభిప్రాయం. ఇక్కడ దాని విమర్శ కవకాశంలేదు. భాసుని తరువాతవి

కవికులగురువులు కాళిదాసులు వ్రాసిన నాటకత్రియం. వీనిలో అభిజ్ఞానశాకుంతలం సమస్తరూపక జగత్తులో ఉన్నత శ్రేణికి చెందిన నాటకంగా సర్వాంగీకృతమైనది. వీరితరువాత అశ్వఘోషుల శారిపుత్ర ప్రకరణం 9 అంకాలలో ఉన్నది. విశాఖదత్తుని ముద్రారాక్షసం; శూద్రకుని మృచ్ఛకటికా; భట్టనారాయణుని వేణీ సంహారం – ఆయా విషయాలలో ప్రథమ శ్రేణికి చెందినవి. వీరి తరువాత కాళిదాస సమకోటికి చెందిన భవభూతికాలం వస్తుంది. వీరి నాటకత్రయంలో కరుణ రస ప్రధానమైన ఉత్తరరామచరిత్ర సంస్కృత సాహిత్యానికే అమూల్య రత్నము. శ్రీహర్ష చక్రవర్తి రచించిన రత్నావళి, నాగానందం, ప్రియదర్శికా ఉచ్చకోటికి చెందిన రూపకాలు. రాజశేఖరులు, ఆర్యక్షేమీశ్వరులూ, మురారి, జయదేవ ప్రముఖులరూపకాలు, సాహిత్య క్షేత్రంలో విశిష్టస్థానాన్ని పొందినవి. ఇవేకాక సంస్కృత సాహిత్యంలో అనేక ఛాయా నాటకాలూ ప్రతీకనాటకాలూ (కృష్ణమిశ్రుని ప్రబోధ చంద్రోదయం వంటివి) వెలిసినవి.

సంస్కృత దృశ్యకావ్యాలలో 10 రకాల రూపక భేదాలు, 18 రకాల ఉపరూపక భేదాలూ ఉన్నాయి. ఈ అతిమధురమైన లలిత సాహిత్యం, సంస్కృతంలో శ్రవ్య కావ్యాలకంటె అధికంగా విస్తరించినది. ఈ దృశ్యకావ్యాలలో కొన్ని సంస్కృత రూపకాల చర్చ ఇదివరకు చేసి యున్నాము.

పద్యకావ్యాలు మాత్రమే కాక సంస్కృతంలో గద్య కావ్య నిర్మాణం కూడా నిరుపమానమైనది. సంస్కృతంలో ప్రప్రథమ ప్రాచీన గద్య వైదిక సంహితలలో ప్రారంభమై చివరకు వ్యాఖ్యానానికి చెందిన క్లిష్టతమ శైలిలో పర్యవసన్నమైనది. ఇట్టి శాస్త్రీయగద్యమే కాక సాహిత్యగద్యపు ప్రారంభం మహాకవి సుబంధుల "వాసవదత్త" లో జరిగినది. ఇంతకు పూర్వుడైన భట్టార హరిచంద్రుని గద్యప్రబంధాన్ని బాణభట్టు పేర్కొన్నారు. కాని అది నేటివరకూ లభ్యం కాలేదు సంస్కృతసాహిత్యంలో గద్యశైలికి ఉత్తమోత్తమమై మనుగతమైన రూపం బాణభట్టు గ్రంథాలలో (కాదంబరి హర్షచరిత్రలు) కానవస్తున్నవి.

పద్యశైలులవలెనే గద్యంలో కూడా పెక్కుశైలులు ఉన్నవి. కాని గద్యానికి ప్రధాన గుణం ఓజస్సు. ఓజోగుణం లేని గద్య నిర్జీవసమానం. గద్యం కవిప్రతిభకు పాండిత్యానికి నికషోపలం వంటిది. ఇందులో సంపూర్ణ సాఫల్యాన్ని చెందిన మహాకవి బాణభట్టు స్థానం సర్వోన్నతమైనది వీరే కాక దండి, ధనపాలుడు, సోమదేవసూరి, త్రివిక్రముడు, అనంతకవి మున్నగువారు దశకుమారచరిత్ర, యశస్తిలకం, నలచంపువు, భారతచంపు మున్నగునవి వ్రాసినారు. ఈ చంపువులు గద్య పద్యోభయాత్మకాలయినా వానిలోని ఉత్కృష్టగద్యభాగం సాహిత్య దృష్టిలో ఉత్తమస్థానానికి చెందినది దక్షిణభారతంలోని ప్రచండ గద్యశైలి వరదాంబికా పరిణయ చంపువులో కానవస్తున్నది. ఆధునిక యుగా

నికి చెందిన ప్రసిద్ధ కవులు విశ్వేశ్వర పాండేయుని మందార మంజరి, అంబికాదత్త వ్యాసుని శివరాజ విజయమూ సరళం, సరసం, ప్రౌఢం, సుందరమూ అయిన గద్యశైలికి పేరొందిన ఉద్గ్రంథాలు.

సంస్కృతకథా సాహిత్యంకూడా ప్రపంచసాహిత్యంలో ప్రభావపూర్ణమైన స్థానాన్ని పొందినది. నేడు పాశ్చాత్య సాహిత్యంలో ఈకథా సాహిత్యానికి విశిష్టస్థానం ఉన్నది. కాని దీని ప్రారంభంకూడా భారతీయసాహిత్యానికి మూల ప్రవాహమైన బ్రాహ్మణ గ్రంథాలలోనే జరిగినది. ధార్మిక పౌరాణిక గ్రంథాలు విడిచిపెడితే, మనోరంజన ప్రధానమైన లోకగాథలకు ప్రారంభం అజ్ఞాతకాలంనుండే జరిగియున్నది. దీనికి సంస్కృతంలో కాక పైశాచీ అనే ప్రాకృత రూపంలో గుణాఢ్యుల బృహత్కథలో ప్రారంభం జరిగియున్నట్లు తెలుస్తున్నది. ఈ బృహత్కథకు సంస్కృతంలో మూడనువాదాలు లభిస్తున్నవి. ఈ కథల ఆధారంతో పెక్కు సంస్కృత గద్య కావ్యాలూ నాటకాలూ వెలువడ్డాయి. పంచతంత్రం ఇట్టి సాహిత్యంలో బహుజనామోదాన్ని పొందినది. దీని మొదటి అనువాదం 6వ శతాబ్దంలో పహ్లవీ భాషలో జరిగి తరువాత ప్రపంచంలో అనేకభాషలలో అనూదితమై ప్రపంచానికే ఈ గ్రంథం ఒక నవీనశైలిని ప్రసాదించినది. బేతాళపంచవింశతి, శుకసప్తతి మున్నగు సంస్కృతకథలుకూడా బహుజనామోదం కారణంగా అనేక భాషలలో అనువాదాలు వచ్చినవి.

సంస్కృతాన్ని బౌద్ధకవులుకూడా తమ రచనలతో లలితలలితంగా తీర్చి దిద్దినారు. కాళిదాసయుగంలో అశ్వఘోషులు, మాతృచేటుడు, ఆర్యసూరుడు మున్నగు మహాకవుల బుద్ధచరిత, సౌందరనందం, జాతకమాల మొదలైన రచనలు ప్రథమ శ్రేణికి చెందినవి. జైనకవులుకూడా సంస్కృత సాహిత్యాన్ని రసవంతంగా తయారుచేసినారు. సాహిత్యక్షేత్రంలో సంకుచిత సంప్రదాయభావనలను దూరంచేసే రామాయణ మహాభారతాలేకాక భాగవతంలోని కృష్ణలీలనాధారంగా చేసికొనికూడా జైనులూ, బౌద్ధులూహిందూదృష్టికోణంతో తమ రచనలు కావించినారు. 11 వ శతాబ్దప్రాంతంలో జైన మహాకవు లీ క్షేత్రంలో ప్రవేశించినారు. అమరచంద్రసూరి 40 సర్గలలో వ్రాసిన బాలభారతమనేకావ్యం వైదర్భిరీతికి చక్కని ఉదాహరణ. పాండవచరిత, నరనారాయణానందం, వసంతవిలాసం, ధర్మశర్మాభ్యుదయం, హీరసౌభాగ్యంమొదలైన మహాకావ్యాలు మాత్రమేకాక పెక్కుమహాకావ్యాలూ ఖండకావ్యాలూ, ఈ కాలంలో వచ్చినవి. ఆచార్య హేమచంద్రులు కావ్యశాసనంవంటి ఉత్కృష్ట కావ్యరచనా శాస్త్రాన్ని నిర్మించడమేకాక సంస్కృత సాహిత్యానికే పెక్కు ప్రామాణిక గ్రంథాలుకూడా రచించినారు.

సంస్కృత సాహిత్య సృష్టిలో కవయిత్రులుకూడా చాలామంది సహకరించినారు. వీరిలో మహారాష్ట్రాంధ్ర కర్ణాటక కేరళలాటదేశాల కవయిత్రులు శ్లాఘ్యమైనకృషిని చేసియున్నారు. విజయ, విజ్జిక, కర్ణాట రాజప్రియ, మధుర

వాణి, ప్రభుదేవి, సుభద్ర మున్నగువారి ప్రసిద్ధ రచనలూ ముక్తకాలు మాత్రమే లభ్యమైనవి. కాని వారి ప్రబంధాలు లభించడంలేదు. రాజశేఖరుడు వీరిలో కొందరిని తన గ్రంథంలో ప్రశంసించినాడు. కావ్యప్రకాశవంటి ఉత్తమ గ్రంథంలో వీరి రచనలు ఉద్ధరింపబడినవి. వెనుకటి దశాబ్దాలలో శ్రీమతి క్షమారావు కర్ణాటదేశంలో గాంధీవాదం మొదలయిన ముక్తక విషయాలపై సుందరకావ్యాలను నిర్మించినారు.

మధ్యయుగంలోని కవు లెక్కువగా తమ దృష్టిని చిత్రకావ్యాలపైపు కేంద్రీకరించినారు. ప్రప్రథమంగా భారవి కిరాతార్జునీయాన ఒక సర్గ ప్రత్యేకంగా చిత్రరచనచేసినారు. అందులో ఏకాక్షరీ, ద్వ్యక్షరీ, మురజ కమలాది బంధాల ద్వారా ఆశ్చర్యం, కుతూహలం, కల్గించే చిత్రకవిత్వం నిర్మించియున్నారు. ఈ పరంపరను మాఘుడు అభివృద్ధి చేసియున్నాడు. తరువాత ఇట్టి రచనలవైపే కవులు మొగ్గు చూపించినారు. అనేకంగా చిత్రకావ్యాల రచన జరిగినది. వీనిలోనే క్రియాగుప్తి; కారకగుప్తి; ప్రహేళిక; ఇంకా మాట రచనలూ వీని లక్షణగ్రంథాలూ ప్రచారాన్ని పొందినవి.

ఉత్తమ సాహిత్యదృష్టితో ఈ వాక్యాలు తృతీయ శ్రేణికి చెందినవి. ఈ రచనలు తృతీయయుగంలోనే అధికమయినవి. తృతీయశ్రేణి రచనలైనా, వీటిలో కవి ప్రతిభా, పాండిత్యం, సమయస్ఫూర్తీ, జ్ఞానవ్యాప్తీ గోచరిస్తాయి.

ఇలాంటి రచనలు క్రిందటి మూడు నాల్గు శతాబ్దాలనుండీ అత్యధికంగా కానవస్తున్నవి. నేటికీ సంస్కృతంలో ఇట్టి కళాకారులు అనేకు లున్నారు.

సంస్కృత సాహిత్య చర్చలో లక్ష్యచర్చతో బాటు లక్షణచర్చకూడా ఆవశ్యకమే. లక్షణగ్రంథాలలో కావ్యాల లక్షణం, స్వరూపం, ప్రభేదాలు, వాటి గుణదోషాలు, అలంకారశైలులు, వృత్తులు, రసాలు, ధ్వని మున్నగు కావ్య నిర్మాణ సామగ్రిని గూర్చిన విమర్శ చక్కగా సాగినది. ఇది అతివిస్తారమైన గహనవిషయం. ఇందులో అలంకార రస సంప్రదాయాలు, వక్రోక్తి మతం; ఔచిత్యవాదం మొదలుగా పెక్కు మత భేదాలున్నవి

కావ్యలక్షణానికి చెందిన ప్రాథమికచర్చ అగ్నిపురాణంలో ఉన్నది. ఆతరువాత మేధావి, రుద్రకవి, భామహ, దండి, వామన, రుయ్యకాదులయిన ఆలంకారికులు, యీ విషయంపై గ్రంథరచనచేసియున్నారు. ఈ ప్రాచీనాలంకార శాస్త్రజ్ఞులు అలంకారాలను రీతినే కావ్యాలకు ఆత్మగా అంగీకరిస్తారు. నవమశతాబ్దంలో కాశ్మీరాచార్యులు - ఆనంద వర్ధనులు ధ్వనినిగూర్చిన గంభీరగ్రంథాన్ని (ధ్వన్యాలోకం) రచించియున్నారు. అది సాహిత్యశాస్త్రానికి ప్రామాణికమైన మూలగ్రంథం. ఆనందవర్ధనులను ధ్వనిమత ప్రతిష్ఠాపనాచార్యులంటారు. అభినవ గుప్తాచార్యులు, మమ్మటులూ

ఈ మతాన్ని శాస్త్రీయదృక్పథంతో ప్రతిష్ఠించినారు. యీ ముగ్గురూ ధ్వని రస శాస్త్రాలకు ప్రామాణికాచార్యులు.

కాశ్మీర వాసియైన మహిమభట్టు ధ్వనిఖండనకై వ్యక్తి వివేకమనే గ్రంథాన్ని రచించినారు. మహిమభట్టు తీవ్ర తార్కికవాది. (వీరియుక్తి ప్రత్యుక్తులు చాలా మెచ్చదగినవి. కాని తీవ్రవాది ) కాశ్మీరంలోనే భట్టకుంతకులు వక్రోక్తి కావ్యజీవితంగా నిరూపిస్తూ వక్రోక్తి జీవితమనే సమీక్షా గ్రంథం రచించినారు.

10వ శతాబ్దంలోని గంభీరసమాలోచకులు శ్రీక్షేమేంద్రులు ఔచిత్యవిషయమైన నవీనసమీక్ష కావించియున్నారు. వీరి తరువాత సాహిత్యదర్పణం-రసగంగాధరం అనే ఉత్కృష్ట గ్రంథద్వయం వరుసగా 14, 17 శతాబ్దాలలో వచ్చిఉన్నవి.

ఇవేకాక రాజశేఖరులు కావ్యరచనా శాస్త్రంలో నవీన సూక్ష్మ మీమాంసా పద్ధతిని ప్రారంభించినారు. వీరు మీమాంస కవులు. వీరి శైలి ననుకరిస్తూ భోజదేవుడు, జైనాచార్యులయిన సిద్ధహేమచంద్రులు, శారదాతనయులు మున్నగువారు సరస్వతీకంఠాభరణం, కావ్యానుశాసనం మొదలయిన సంగ్రహగ్రంథాలను నిర్మించినారు.

ఈ కొద్ది పుటలలో సంస్కృత సాహిత్యక్షేత్రాన్ని చర్చించబూనడం అసంభవం. ఈ సాహిత్యం మహావిశాలమైనది. ఇందులో అవాంతర భేద ప్రభేదాలు మిక్కిలిగా

ఉన్నవి. కళలను కూడా సాహిత్యంలో అంతర్గతంచేస్తే, దీని విస్తారమింకా అధికమైపోతుంది. 64 కళలు, 400 ఉపకళలూ ఇందులోనివే. భామహులన్నట్లుగా —

న తచ్ఛాస్త్రం న సా విద్యా న తచ్ఛిల్పం న సా కళా
జాయతే యన్న కావ్యాంగం, అహో! భారో మహాన్ కవేః"

(కావ్య రచనకు అనుబంధంకాని శాస్త్రమూ, విద్యలూ, శిల్పమూ, కళలూ ఉండవు. ఇవన్నీ కవికి తెలియాలి. కవికి ఎంత బాధ్యత ఉన్నది!) ఇంతటి బాధ్యతను విశదం చేయడం ఈ కొద్ది పుటలలో అసాధ్యం కదా!

మేము ఈ ప్రసంగాన్ని ఇంతటితో ముగిస్తూ—సమస్త ప్రాంతీయ భాషలకూ, విశేషంగా రాష్ట్రభాషనూ ఉన్నతికి తీసికొని రావడానికి సంస్కృతాన్ని ఆదరించాలనీ, ఇందలి ఉపయుక్త వాఙ్మయాన్ని ప్రాంతీయ భాషలలోకీ, హిందీలోనికి అనువదింపచేయాలనీ, నవ్యసాహిత్య నిర్మాతలకు సంస్కృతాధ్యయనం అనివార్యంకావాలనీ వాంఛిస్తున్నాము. ఈ భాషా సాహిత్యాల నుపేక్షించడం మన అనంతమూ, అక్షయమూనైన సంపత్తిని పోగొట్టుకొని మన అస్తిత్వాన్నే ఉపేక్షించడంతో సమానం కాగలదు.